ఆంధ్రరత్న

# గోపాలకృష్ణుని చాటువులు







గోష్ఠి ప్రచురణాలయము,

అమలాపురం

1964 ] [ 40 న పై

## పీఠిక

2785/RO

ఆంధ్రరత్న గోపాలకృష్ణుని 'చాటువు' లను చిన్న పొత్తముగ ఇప్పటికి ముప్పదియేండ్ల క్రిందట మొదటిసారిగ ప్రచురించియుంటిమి. నాటికి నేడిది ద్వితీయముద్రణ. ప్రథమ, ద్వితీయ ముద్రణలలోని భేదములు బహు స్వల్పములు. "ఎంకిపాటల" పై గోపాలకృష్ణుని తీక్షణవిమర్శ కొన్నిచోట్ల అశ్లీలముగ నున్నదని ముఖ్యముగ మిత్రులు శ్రీ ఆచార్య రంగాగారి కోరికపై యీసంపుటిలో వదలివేయబడినది. ఇట్లనే రెండు అసంపూర్తిపద్యములును తీసివేయబడినవి. అనేకమిత్రుల కోరికపై ఆంధ్రనాయకుని గూర్చిన పద్యము నూతనముగ యిచ్చట జేర్చబడెను.

ఇందలి పద్యముల సంఖ్య బహుస్వల్పము అయినను వీనినేల ప్రచురించవలెను?

(1) అధునిక ఆంధ్రులలోనేగాక యావద్భారతమందును గల మహామేధావులలో మన ఆంధ్రరత్న మొకడు. అట్టివాడు తన సమకాలీక ఉద్యమములు, వ్యక్తులు, పై గూర్చి అప్పుడప్పుడు "చాటువు"గా జెప్పిన భావములు చారిత్రిక ప్రాముఖ్యత బడయగలవని నా అభిప్రాయము,

ష్పదు "ముందుగతులెల్ల ఖామందువీవు" అను సూక్తి భక్తిమార్గములో అత్యున్నతమగు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను స్థితిని సూచించును "ఆంధ్రవాణీవిలాసము" లోని "నీద క్రోడవిమానంబు నిలుపవయ్య" అనునది పిల్లలమర్రి పినవీరభద్రుని "వాణి నారాణి" సంప్రదాయమును జ్ఞప్తికి దెచ్చును. ఆ ధర్మనాయకులందలి లోపములు వర్ణింపుచు 'తపములేసిదె యెన్నరే నకములెల్ల? అనుసూక్తి సంపూర్ణ భక్తిశ్రద్ధలతో గూడిన తపోదీక్షయే మనకెల్లరకు శరణ్యమని బోధించును ఇట్టి మహనీయుని చాటుపద్యములు ఆంధ్రమహాజనులకు సంపూర్ణ సమాదరణీయము లగునని ఆశించుచున్నాను

గోష్ఠి అమలాపురము
క్రోధి సం॥ర చైత్ర శు ౧ ౦
(15-3-1964)

గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

శ్రీరస్తు

# ఆంధ్రరత్న గోపాలకృష్ణుని చాటువులు.

## శ్రీరంగనాధ ప్రబోధము



కదా వా కావేరీవిమలసలిలప్రాఙ్గణానట
చ్ఛుభ్రాఙ్గం శ్రీరఙ్గం తమిళహృదయధ్వాన్తదళనమ్
తనో త్యాతిథ్యం మే నిజసదసి బన్ధచ్యుతియుతే
మహాన్తైత్యాక్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్ ॥ ౧

కదా వా శ్రీరఙ్గే భవరసతరఙ్గే ఫణితలే
శయానం స్వారాజ్యాసన ఘనశయానం హృదిభజన్
అన్యే రఙ్గస్వామిన్ తమిళజనసంభావితవిభో
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్॥ ౨

శ్రీరఙ్గేశ కృపాళో తమిళజనసభాధ్యక్షదీక్షాంతరఙ్గ
స్వారాజ్యానన్దనిద్రాపరవశ ద్రుతముత్తిష్ఠ భో రఙ్గనాథ
త్రేతాయాం రామచన్ద్రాకృతిధృతభవతాప్రీణితై వాన్ధ్ర
స్త్వాంన్ధ్రోహాం వర్తమానాం తవభవనకథాంవక్తుమత్ర
త్వోత్సి ౩

అన్యైశ్శక్యగ్రహైర్న్యైత్స్వహితజనవచోద్భిన్నఖిన్నాన్తరఙ్గాః
సర్వైస్త్యాంగ్లైయదేతత్త్రిణభరణకణా ప్రీతిముత్పాదయన్తి ।

దృష్ట్వా దాస్యిత్వమేతద్వ్యధికృతమితి సంశోధ్య కారుణ్యసాన్ద్రి
వ్యామోహవ్యూహదావానలతులితగృహీతోగ్రిసత్యాగ్ర
హో యః

ప్రేమాస్త్రిస్త్రప్రశాన్తవ్రతప్రణుత మహీ మోహనాజ్ఞో
మహాత్మా

గాన్ధీస్వారాజ్యగర్ధ్రాఽవిచలదథునాసఖ్యవైముఖ్యమోగమ్॥

(ది 2–10–1922 తేదీన శ్రీరంగములోఁ జెప్పినవి)



# శ్రీ రామలింగేశ్వరస్వామి

(ఈ పద్యము శ్రీరామనగరున 7-3-1925 న శ్రీరామాలయమున శంకుస్థాపనచేయు సమయమునఁ జెప్పఁబడినది)

సీ॥ శ్రీగిరిజాసతి స్మితముఖాంభోరుహ
సారస్యమధుపానసమయములను
బ్రహ్మాదిమునిముఖ్య ప్రార్థితదానవ
సంతానసంహారసమయములను
వరకుచేలాదిభూసురభక్తసంతాన
సంగంధ పాద్యార్ఘ్యసమయములను
నవయుగోదయవేళ భవనమంచితవస్తు
సంతానముసృజించుసమయములను
తే॥ గీ॥ ప్రళయతాండవ ముద్దడలింపు వెలయు
రాజరాజేశ్వరీతనో రాజ్య మేలు
సమయముల నాదుఁ బల్కులజాడ వినుము
రామనగరీవరాంగ ! శ్రీరామలింగ !



# శ్రీ రామచంద్రుఁడు

శ్రీవిభుఁడు శ్రీరామచంద్రుఁడు
భూవిభుఁడు కోదండరాముఁడు
భువిని వెలసెను రామనగరిని
కవిజనాశ్రియుఁడై ॥

శ్రీవరుఁడు సుగుణాభిరాముఁడు
భవుఁడు శ్రీ కోదండ రాముఁడు
అవనిభారముఁ బాప మాపురిఁ
బవనసూనుని గూడి వెలసెను
కవనగాన వినోదవాక్సుమ
నవన మర్పింతున్ ॥

—

# ప్రతిమారాధన

(ది 2-2-26 న గుంటూరుపురమున వేమనశతకము లోని యీ క్రింది పద్యములను జదివినమీఁదట జెప్పిన పద్యములు )

ఆ॥ తొలుకడుపులోఁ దొడ్డవాఁడుండఁగ
రాతిగుళ్ళ నేల రాశిఁబోయ
రాయి దేవుఁడైన రాసులమ్రింగదా
విశ్వదాభిరామ వినుర వేమ

ఆ॥ శిలలఁజూచి నరులు శివుఁడని భావింత్రు
శిలలు శిలలె కాని శివుఁడు కాఁడు
తనదులోని శివుని దా నేల తెలియఁడో
విశ్వదాభిరామ వినుర వేమ

## ఆంధ్రరత్న సమాధానము

శిలలోన గల్గు జీవునిఁదెలియక
వాని నిశ్చలతయు వానిపరతఁ
దెలియ కిట్లు బేలఁ దెలివియాఁపట నీకు
వినయ మెపుడుగల్గు వెఱ్ఱివేమ ?

తొలుకడుపువాఁడు సోలెఁడైనను గోరు
రాశియైనను శూన్యరాశినైన
ముట్టకుండన మెచ్చు చట్టుదేవుఁడు గోరి
తెలియ కిట్లు తూలితేల వేమ ?



# శ్రీ మంగళగిరి నృసింహస్వామి

( ఆంధ్రరత్నము 1926 సం॥రములో కొంతకాల మౌషధసేవఁ జేయుచు మంగళాద్రియం దుండెను అప్పటినుండి తా 23–6–26 న రామన [illegible] చెప్పిన పద్యములు )

ఉ॥ ఎండల కోర్వలేక యిటు లింటికి వచ్చితి నంతెగాని నీ
యండను వీడలేదు భవదంఘ్రియుగంబు సదా మదీయహృ
న్మండలి నిల్పినాడ ననుమానము వీడవె నాదుజాడ్యమున్
వెండవె మంగళాద్రినరసింహ! సుధాలయ! పానకాలయా॥

ఉ॥ ఎండల కోర్వలేకజామి యింటికివచ్చితి మంగళాద్రికిన్
రెండవసాటి రామనగరీక్షితియంచునుఁ దొల్లి త్రేత కా
లాం పురామచంద్ర విమలాకృతితోనటు నీవకావె మా
కండగనిల్చి ప్రోతువుశుభాద్రినృసింహ! పానకాలయా॥



# మహాత్ముని యుపవాసము

(1924 సంవత్సరమున ఢిల్లీయందు జరిగిన శ్రీగాంధీమహాత్ముని యుపవాస సందర్భమునఁ జెప్పిన పద్యము)

సీ॥ వాదవైఖరిఁ దోలి వేదాంతరతిఁ దేలి
స్వారాజ్యపారంబుఁ జేరుకొనక
వ్యవహారనయసమన్వయభవ్యమార్గ మా
నేత్వగస్థలిఁ బ్రతిష్ఠించుకొనక
హింసావధాగత ధ్వంసియాధర్మంపు
వంశం బహింసచే వర్ధిలుటకు
లోకకళ్యాణమ్ముఁ జేకూర్ప నాత్మార్ప
ణమ్మను నర్షికధమ్ముఁ దుదిసఁ

బూనినాఁడు మహాత్ముఁడు భూభరమ్ము
బాపఁగా నేఁడు మహాముపవాసవ్రతము
ముక్తినుమహూర్త వేళలు మూఁగిన విశ
శాసనగదీనరేంద్ర! (శ్రీరామచంద్ర)

---

## తన్ను గూర్చి

(1920 సం॥రములో మహానందియందు జరిగిన యాంధ్రమహాసభా సమయమున బందరు పెద్దలు కొందరు తనను ' సుంకర కొండ " యని యెగతాళి చేయగా నిచ్చిన జవాబు. ఇందు తాను శంకరుని యపరావతారమని చెప్పుకొనెను )

క॥ బింకాలు పలుకు బందరు
సుంకల మీంకార మెల్లఁ గీడ్పడసేయన్
శంకరుఁడె మహానందిని
సుంకరకొండాయె యాయెఁ జోద్యం బేరా ?

* * * *

సీ॥ వేదాంతములతోడ వెక్కిరింతలతోడ
లెక్కలో పాగించు లీల నెవఁడు
లక్ష్మమ్మ పాటిచేత యక్షగానములతో
కాలంబు వ్యర్థంబు చేయఁ డెవఁడు
చీరాల పేరాల చిన్ని గ్రామంబుల
దోస మెన్నక కొంపఁదీసె నెవఁడు
'ఆంధ్రరత్నం' బంచు గహాముకతోఁ బెద్ద
పిన్నలంచును మది నెన్నఁడెవఁడు
[ఆంధ్రరత్నం బంచు నధమపక్షము సుంక్రి
కొండడై యరికోటిఁ జెండు నెవఁడు]
అట్టి గోపాలకృష్ణుని హాస్యసరళి
గోలకృష్ణునిఁగాఁ జేసి కొలుతఁదీర్చెఁ
గాక(పట్టు) పగ్గములుండు నే "గాడ్డు" కైన
రామనగరీనరేంద్ర! (శ్రీ)రామచంద్ర! [1925]

## నాన్‌కోఆపరేషన్ నాయకుడు

సీ॥ గాంధిదేవుని రాక కంచు ఢక్కాలఁగాక
కరతాళశబ్దాల దరువుఁగోరె*
దేశబంధునిదశ ద్వీపసాలతోఁదీరె
రాజగోపలచారి బూజుఁబట్టె
కొండవెంకటప్పన్న ఉండిలేకుండెను
బాయిషశేట్లు నిర్భాగ్యులైరి
లాలలజపత్రాయి కోలుపోయెను శ్రద్ధ
చండి సరోజిని పండిపోయె
అలీలు గోలిలఁ గేళిసవాల్ మాని
ఖాళిగ తాలీలపాలఁబడిరి
జమ్నలాలూసెట్టి తుమ్మపీనుఁబట్టి
ఖద్దరుకాన్సబ్ సద్దుచుండె

మొదటితాకిడి కింతెట మోసమయ్యె
ఖ్యాతి కొక్కఁడు నిల్చె మా మోతిలాలు
ముందుగతు లెట్టులానో ఖామందు వీవు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర॥



* "పురుషోత్తముఁ డనుకొన్నాము ఉత్తమపురుషుఁడైనాఁడు"

# ఆంధ్రవాణివిలాపము

సీ॥ రామలింగారెడ్డి సీమరాజుల పెరిగ్
చేరి నన్ బొందంగ గోరుచుండె
గంధికోవాటి నన్ను హిందిచే నెట్టించి
బందిలోఁ బెట్టింపఁ బంపుచుండె
పండితుండనువాడు తిండికై వెండికై
చండాలుకడనైన నుండుచుండె
కొంతిమేరు కవిగాళ్ళుగతు లయోమయములై
నన్ను వీథినిఁబెట్ట నెన్నుచుండె

అకట! దిక్కెవ్వరింక నా కవనియందు
అనుచు నేడ్చుచునున్నది యాంధ్రవాణి
నీదుకోడలిమానంబు నిలుపవయ్య
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర॥

*        *        *        *

సీ॥ దాపెర్ల రామణ్ణి సీమలో మెచ్చారు
యెంకిపాటలు నింగి కెక్కుచుండె
పంగవాసి ఘటర్జి నింగిలీషు కజిన్సు
మెచ్చి గ్రింధాల్యాంజలి - చ్చవేసె

* కవుతరయ్యాకు మాళ్ళ ఖండాంతరంబులఁ
గొప్పగొప్పెళ్లంచు గొలపుట్టె
అడవిబావడిపెరు పడలే దదింకాను
వడుతుంది దొరలలోఁ బడినయపుడు

కళలు పుష్పైకు తెలుంగులగడ్డలోన
ననుచు "క్రిటికులు" ఘోషింతు రౌనుగాని
మనకుమాత్రిము గన్పింవమానె నేమొ
రాఘునగరీవరేంద్ర! శ్రీరామచంద్ర!



---

* కవుతా శ్రీరామశాస్త్రిగారు

## బాపట్ల

సీ॥ భావనారాయణస్వామి నీమమూఁబూను
గుడిలోని వేదాంతగోష్ఠితోను
శివదివాణము కాడ 'సనిమ' నాట్యమ్మాడ
సంధ్యాటన పీడు సాంబశివుఁడు
దేశాంతరులనీతి క్లేశాంకముగఁ బాతి
ఆశాంతమును జాతు రవనిసురలు
వతుగలింతురు లేక యితరు లంతను రాక (కి)
రసికత్వము హసించు రాజవీధి

పంచభూతములవి బారె నంచులకును
పురమరాతులదయ్యెను భూతమేమొ!
బాగుఁజేయుము బాపట్ల వేగ మీవు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!॥



# నరసారావుపేట

సీ॥ గృధ్రవాయసవానభద్రభాగి వాసించు
మిద్దెకొండలకాంతి మేహాశాంతి
కంబంగారంబుఁ గడుపారఁ గన్నకం
సాల కౌశికుఁ బట్టి నేలవట్టి
లంకాపురాధీశు పంకాలలోఁ బుట్టి
పైఁబడి బ్రతిమాలు పైరుగాలి
చలికాదు కోటయ్య యింపిడి కొండెక్క*
గంగ వొచ్చెను భూమిగర్భశరణు

అకట! నరసన్నరాయుని వికటపేట
గగన మొక్కటి కల దాదుఁ గజపుదీర
గాక నేగెడె ప్రఁపీడి కాననముకు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!!

---

* కోటప్పకొండ

# గుంటూరివారు

(ది 26-2-26 తేదీన గుంటూరుజిల్లామహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షులుగ గోపాలకృష్ణుడు సభికులకొసంగిన స్వాగతపద్యము)

సీ॥ శ్రీమదాంధ్రావనీ క్షేమసీమాంస వి
స్తారపూరితులు గుంటూరివారు
తిక్కనాది మహాంధ్రదిగ్గజేంద్రవిహార
సారభూవరులు గుంటూరివారు
నిఖిలాంధ్రనేతృత్వ నిరుపమప్రజ్ఞాప్ర
కారపారగులు గుంటూరివారు
ధర్మసంగ్రామసందర్భనిర్భర వాక్య
పూరాగ్రవరులు గుంటూరివారు

వరలిచ్చుచున్నారు స్వాగతము
ధర్మదీక్షితులగు సభాస్తారతతికి
చేరి నటియింపు వారి హృత్సీమలందు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!



సీ. కొండవెంకటప్పన్న గుండుసున్నగదన్న*
గోపాలకిట్టాయి కొక్కిరాయి।
టంగుటూరు ప్రకాశ మింగిలీషుపిశాచి
నాగేశ్వరుడు వట్టి నాగుజెముడు।
పట్టాభిసీతన్న తుక్కుపురుగుగదన్న
ఉన్నవలచ్చుమన్న దున్నపోతు।
గొల్లపూడిసీతన్న కళ్లుకేనికబోది
బులుసు సాంబడు వట్టి పుట్టుకుంక।
అయ్యదేవరవాడు పెయ్యనాకుడుగాడు
అయ్యంకి రమణయ్య డయ్యమయ్య।
డాక్టర్ సుబ్రహ్మణ్య మాక్టింగ్ ఫులిస్టాపు
దువ్వూరి సుబ్బమ్మ దృష్టిబొమ్మ।

అనుచు బలుకఁదు రాంధ్రుల నపనియందు।
గాంధిశ్రేష్ఠునిమతములో గలసినపుడు।
తపములేనిదె యెన్నరే నెపములెల్ల।
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

---

* From hero to zero

## ఆంధ్రసభాధ్యక్షులు

సీ॥ ఒయ్యూ నరసిమ్మయ్య బ్రహ్మలోకాన్నుండె
న్యాపతి సుబ్బన్న చూపుతగ్గ
పానుగంటి విబుండు ప్రథమప్రధానుడై
ప్రభు చెంతను జేరి యొదిగియుండె
మోచర్ల రామన్న ఖేచరుండై యుండె
* కే వి కృష్ణారావు కీర్తిమిగిలె
పట్టాభిసీతన్న గట్టుగా కాలంబు
'జన్మభూమి' నిఁ జేరి జరుపుచుండె

వీరలందఱు మూడరేట్వోధివారు
ఆంధ్రసభ మున్ను నేలి రత్నాదరమున
నేడు మనపాల బడియెను నిశ్చయముగ
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర॥



* ది॥ శ్రీ॥ పోలవరం జమీందారుగారు

# ఆప్తవాక్యము

(శ్రీయుత కడింపల్లి నరసింహారావుగారికిఁ జెప్పినది)

సీ॥ సత్త్వమూర్తివి నీవు సతత తామసగుణా
క్రాంత ప్రాంతభ్రాంతరంగ మద్ది
దానశీలుఁడ వీవు దానవాంఛితదీన
నిర్ణయాంతరపూరదుర్ణయ మది
త్యాగభోగివి నీవు రాగసాంగత్య సం
జాతపాతకకర్మవ్రాత మద్ది
బ్రాహ్మణోత్తముఁడ వీవబ్రాహ్మణాంగ్లేయ
దాంపత్య దస్సంప్రదాయ మద్ది

అని మునిసిపాల్టి వర్ణింతు ననవరతము*
నాదు ప్రాణంపురఘునకు నయముమీఱ
గలుగ నిమ్మిపు డాత్మీయజ్ఞానపటిమ
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

---

* చీరాల నాయకుఁడైన గోపాలకృష్ణుఁడీపద్యముఁజెప్పుట యెంతయు సమంజసముగ నున్నది. మన ప్రస్తుత పురపాలన "పానానాం పాన పరిపాలన" యని యీతఁ డొకానొకసమయమునఁ జమత్కారముగ నుడివెను

## కాశీనాథుని నాగేశ్వరరావుగారు

సీ॥ ఆంధ్రపత్రికతోడ నమృతాంజనం బిచ్చి
తలనొప్పిఁ బాపెడి ధన్యుఁడెవఁడు
లక్షలాదిగ డబ్బు దీక్షతో సమకూర్చి
భిక్షకోటినిఁగాచు దక్షుఁడెవఁడు
ప్రతికాన్ఫరెన్సును గతినీవెయని వేడ
ప్రెసిడెంటుగా నేలు రసికుఁడెవఁడు
మితవాదిహితుఁడౌచు నతివాదగతుఁడౌచు
నందు నిందునుఁజేరు డెవఁడు

అట్టి కాశినాథుని నాగయాహ్వయుండు
పుట్టకుండిన నాంధ్రంబు పుట్టిమునిఁగి
గిట్టకుండునె యేనాడొ యట్టెసీల్గి
రామనగరీ నరేంద్ర శ్రీరామచంద్ర॥



## టంగుటూరు ప్రకాశం పంతులుగారు

సీ॥ అరవవాగ్వ్యాపార మచ్చుదా నొత్తుచు
*మలయాళభగవతిఁ గొలుచునెవఁడు
అగ్నిసాక్షిగఁగొన్న నంబుజాక్షి నివీడి
ధనయశశ్శికా తల దగిలెనెవఁడు
ఆంధ్రకాంగ్రెసు సభాధ్యక్షతఁ జేబూని
భారతావని నేలఁ గోరునెవఁడు
లోకసగ్రహదీక్షఁబా కి పైకెక్కి తా
"స్వారాజ్య" మందంగ గోరునెవఁడు

కాలభైరవభీకరోగ్రానల ప్ర
కాశమూర్తియై గ్రాలుఁ బ్రకాశమూర్తి
కలుగ దేశాని కింకేమి కల్గు కొదువ
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!!



---

*స్వరాజ్యపత్రిక కప్పటిసంపాదకుడగు కీ॥ శే॥ కె యం. పనిక్కరుగారు

## కాన్పూరు కాంగ్రెస్

సీ॥ గంగామహాదేవి గంజిపోసినఁ ద్రావి
గతిమాలినూరుగా కాన్పూరు
వాల్మీకి ఋష్యాది వాటికలకు వన్నె
కాటి కివ్విటిపేరు కాన్పూరు
ఖాంతస్వాతంత్ర్యఘోరాహవోద్భవ
ఖడ్గహూణవిహారు కాన్పూరు
వాల్మీకి వాక్కుతో లాల్మీలి* కూతతో
కాస్త్రపాలిలనూరు కాన్పూరు

నేటికొచ్చెను కాంగ్రెసు వేటగాడు
శక్తి లేదింక నీయెడ భక్తి లేమి
గాక నీయెడ యత్తింటి గతి యుచేల
రామనగరి నరేంద్ర! శ్రీరామచంద్ర॥

---

* లాల్మిలి మిల్లు

# స్వేతరీతులు

సీ॥ వెంటనె టనె వోయి గుంటజంటను దెచ్చి
యొంటిగంటకు నింట  చుంట
పాప్రుదాపులఁజేరి కైపు నోపుగఁజేసి
తావ మాపగలేక గోప్రిపుచుంట
వాటుహోటలలో దూరి హాటుహాటువి మంచి
యేటుప్లేటుల దెచ్చి యీటుచుంట
రాసవాసములందు దాసిలెస్సీల సం
దేసు గూసులచిందు*లేసు చుంట

స్వేతరీతులు బూతులు నీతు లుత్త
పోలిటిక్సును
డబ్బు దబ్బునఁ గోల్పోయి డాబుగాను
ఆంధ్రభూమినిఁ దిరుగుదు వాధవాని



---

*Eat - తినుట

*The ass dance and the goose dance-పాశ్చాత్య నాట్యరీతులు

# చదువు మోపైన చానలు

సీ॥ పరీక్షకు పాపిళ్ళు నిక్కిన ముక్కోళ్ళు
వాడిపోయినమోము బీడుకళ్ళు
ఎండిపోయిన . పండిపోయిన ముళ్ళు
కాళ్లకు మేజోళ్లు కళ్లజోళ్ళు
ముళ్లుగట్టినజుట్టు ముళ్ళుపెట్టినకట్టు
నక్కి గుట్టినబట్ట నడుము తట్ట
సందుచేసినచంక కందిపోయినడొంక
పలుచఁబాఱినతొడ పలకలమెడ

గూనిరెక్కలు చుక్కాని లేనివాణి
పసిడిపళ్ళను కిల్లిన ముసలిపెదవి
చదువు మోపైన చానలచండ మూర
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

—

# బందరుసభలు

(1925 బందరు ఆంధ్రరాష్ట్రీయ మహాసభలఁగూర్చి)

బడాయికోర్లన్న, కాంగ్రెసు
బడాయికోర్లన్న-
బందరులోన సందడిచేసిరి ॥ బ॥

విందులు చిందులు తందనాలతో
వందలకొలదిగ సందడిఁజేసిరి ॥ బ॥

పొట్టమాటలను చాటుధారలను
వోటుకు, రైటుకు లోటుపడక బహు
బూటకములతో, నాటకములతో
ప్లాటుఫారమున ఘాటుగ వాగిరి ॥ బ॥



# శాసనసభా బహిష్కారముం గూర్చి

(కారాగారవిముక్తులై వచ్చుచు మదరాసునగరమునం దిచ్చిన యుపన్యాససందర్భమున జెప్పినది)

న యాచే రిఫారం - నవా స్టీలుఫ్రేముం
న కౌన్సిల్ నతు ప్రీవికౌన్సిల్ పదం వా
స్వరాజ్యార్థి హన్త్రాంగ్ల రాజ్యే నియన్తా
ఫరంగీ ఫిరంగీ దృగంగీ కరోతు॥



## హాస్యచక్రవర్తి — దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

## కొన్ని ఆంధ్రరత్న సూక్తులు

బెజవాడలో నొక ఆంగ్ల దినపత్రిక స్థాపించవలెనని డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారొకసారి ప్రయత్నించేరు సభ జరిగింది 'Wanted an English Organ for Andhras' అని కరపత్రిం ప్రచురించేరు సభలో గోపాలకృష్ణయ్య గారిని మాట్లాడమన్నారు మొదట నిరాకరించేరు బల వంతం చేయగా, 'మాట్లాడ్డాని కేముంది? ఇందాకా డాక్టర్ గారే తెలవిచ్చేరు—ఇప్పుడాంధ్రులకు ప్రత్యేకంగా Organ లేదు ఇంతవరకు మనవాళ్ళు బెసెంటుగారి Organ New India' పత్రికతోనే కాలక్షేపం చేస్తున్నారు' అన్నాడు — సభంతా గొల్లుమంది

♦ ♦ ♦ ♦

1920 మహానంది సభలో కొందరు జాతినిని "సూకర కొండాయు వేదమునే గెలిచేస్తే, ఆంధ్రరత్న సమాధానం "బింకాలు పలుకు అనేవద్దు" 1924 లో చెన్నపురిలో జరిగిన ఆంధ్రమహాసభలో వందనసమర్పణ చేయవలసివచ్చి నది. అందరినీ స్లాఘించేడు ఆరోజులలో దేశకంటకులుగా భావింపబడిన సి. ఐ. డీ ల ప్రస్తావన యెత్తుకున్నాడు. ఆంధ్ర

రత్నం 'ఇప్పటి ఎన్నికలకు కూడా మన వందనాలు ఇవ్వాలి. మనసభలకి అవసరమే 'వైధవ్యలేని పెళ్లి వెలవెల పోయిందన్నట్టు, పిపాడీలు లేని సభ గర్జి కట్టదన్నారు.

♦ ♦ ♦ ♦

గుంటూరు కాంగ్రెసు ఆఫీసుకి ఆంధ్రరత్నం ఒకసారి వెళ్లేసరికి శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి గారు ఖద్దర్ బోర్డు లెక్కలు చూస్తున్నారు 'ఏం చేస్తున్నారు? శాస్త్రులుగారూ! తార్కీలు కూడుతున్నారా ఏమిటి?' అన్నారు

♦ ♦ ♦ ♦

1924లో కాంగ్రెస్‌లో స్వరాజ్యపార్టీ "నో ఛేంజ్" (No Change) పార్టీలని రెండుపార్టీలుండేవి. గోపాలకృష్ణుడు కొంతవరకు స్వరాజ్యపార్టీ అభిమాని. రెండో పార్టీని "మారనిపార్టీ" అని చమత్కరించేవాడు. ఈ రెండింటిలో ఏది మంచిదండీ? అని ఒకరు ప్రశ్నిస్తే, గాంధీగారి మొండితనం కంటె నెహ్రూగారి వెధవతనమే బాగున్నట్టుందండి!' అని ఆంధ్రరత్న సమాధానము. నో చేంజి పార్టీకి ఆరోజులలో గాంధీగారి అభిమానం ఉండేదని ప్రతీతి

♦ ♦ ♦ ♦

1921 లో బరంపురంలో ఆంధ్రసభలు జరిగేయి. అందులను తన రామదండులో చేరమని ఆంధ్రరత్నం ఉద్బోధించేరు. "అయితే తురకలమాట ఏమిటండీ?" అని ప్రశ్న

వచ్చింది అందుపై ఆంధ్రరత్న సమాధానం "వీరు చంద్ర వంకను ఆరాధిస్తారు శివుడు చంద్రశేఖరమూర్తి రుద్రమూర్తిన్ని అతనివలె వీళ్ళున్న రుద్రాభిమానులే తన నెత్తిమీద గంగను అలంకరింపజేసుకోవలసివచ్చుటచేత ఆపె య్యాజ్ఞపై అతడు తన శిరోజములను గడ్డము మీదకు 'ట్రాన్స్ఫర్' చేసుకున్నాడు అందుచేత ముసల్మానులంతా శివభక్తులే మనకు శివకేశవాభేదం గనుక వాళ్లూ ఈరామదండులో జేరవచ్చును అల్లాని కొన్నిచోట్ల 'శంకర్ అల్లీఖాన్' అనికూడ పిలుస్తారు మీకింకా సందేహం వుంటే, హైదరాబాద్ నైజాంగారిప్పటికీ భద్రాద్రిరామునికి ముఖ్యట్రస్టీ కావలిస్తే కనుక్కోండి!" అన్నాడు

♦ ♦ ♦ ♦

సుప్రసిద్ధ కవియైన ఉమర్ఆలిషా గారొకసారి ఆంధ్ర రత్న రామదండు నుద్దేశించి "రామదండు మిశ్రమ సమాసమగుటచే దూష్యముకాదా? యని ప్రశ్నించెనట, అందుపై "ఉమ్రాలీషాకవి యేసమాసమండీ?" అని ఆంధ్రరత్న సమాధానము

♦ ♦ ♦ ♦

స్వరాజ్యపార్టీనాయకుడైన చిత్తరంజనదాసు (C R Das) గారిని ఒకసభలో మెచ్చుకుంటూ, "నేనూ ఒక C R దాసునే - చీరాల రామదాసు!" అని చెప్పేరు

♦ ♦ ♦ ♦

ఒకతూరి గుంటూరు ఎ సి కాలేజీలో సభ డాక్టర్ రాధాకృష్ణయ్యగారు (ప్రస్తుత భారతాధ్యక్షుడు) వక్త - ప్రిన్సిపల్ రాయస్ట్రాక్ అధ్యక్షుడు - "India speaks,

America presides" అని ఆ ధ్రరత్న వ్యాఖ్య.

♦ ♦ ♦ ♦

"అనిబెసాంటుకు మోక్షం వచ్చినా రాకపోయినా, ఆ పెథ క్తులకు తప్పకుండా వస్తుంది గాంధీ అనుచరులకు వచ్చినా, రాకపోయినా గాంధీగారికిమాత్రం తప్పకుండా వస్తుంది"

♦ ♦ ♦ ♦

గయాకాంగ్రెసులో మోతీలాల్ నెహ్రూగారు, ఆయన కుటుంబాన్ని (జవహర్లాల్ కమలా, ఇందిరా, కృష్ణ విజయ లక్ష్మి వగైరా) చూచి 'బందరులో రామసింగు పంచదార చిలకల్లాగున్నారే! అన్నాడు

♦ ♦ ♦ ♦

1923 గయా కాంగ్రెసులో ఒక ఛాందసుడు పట్టుబట్ట కట్టుకొని భోజనానికి వచ్చేడు ఆయనపక్కనే కుసుమ ధర్మన్న అనే ఆదిమాంధ్రుడు కూర్చున్నాడు, అప్పు డాంధ్రరత్నం ఆఛాందసునితో 'శాస్త్రులుగారూ' మీ ప్రక్క కూర్చున్న వారెవరో తెలుసునా ? కుసుమా ధర్మన్నగారు! మీరు వెంటనే మీబసలోకి వెళ్లి బట్టలుమార్చుకొని ఫలహారం చేసినట్టుగా ఈభోజనకాండ పూర్తి చేసుకోండి" అని హెచ్చరించేడు

♦ ♦ ♦ ♦

పాకీదొడ్డిలో గాంధీగారు గీతాపారణ ప్రారంభిస్తే "ఈయన వర్ణి అరసిమిడనుకుంటానండీ! అస్పృశ్యత పో గొట్టాలంటే, పాకీమనిషిలో మాతృత్వం చూపించాలిగాని, యీ అపవిత్రత ఏమిటి ?" అన్నాడు, ఆంధ్రరత్నం

ప్రశ్న - మీరు క్రాపింగు ఎందుకు పెట్టుకున్నారండీ?

సమా - అది Universal hair-cut – విశ్వమానవ పద్ధతిగనుక

♦ ♦ ♦ ♦

గాంధీశిష్యులగురించి – "ఇదంతా ఒక ism అండీ– గాంధీ-ism అప్పయ్యదీక్షితులుగారి గోచీఇజమ్ వలె!" అన్నాడు–అంటే దీక్షితులుగారు గోచీ సవరించుకుంటే, శిష్యులూ సవరించుకోవడం మొదలుపెట్టేరుట!

♦ ♦ ♦ ♦

నాన్‌కోఆపరేషన్ రోజులలో చెన్నపురిప్రభుత్వాన్ని రావణాసురునితో పోల్చేవాడు – ఆంధ్రరత్నం గవర్నర్ (విల్లింగ్డన్ ప్రభువు శాసనసభాధ్యక్షుడు, నలుగురు కౌన్సిలర్లు, ముగ్గురు మంత్రులు ఒకపార్టీనాయకుడు (పిట్టి త్యాగరాయ శెట్టి)– ఈపదిమంది దానికి పదితలలుట!

♦ ♦ ♦ ♦

ఒకసారి పానగల్లురాజా (ముఖ్యమంత్రి) చీరాల వచ్చేడు విభీషణునివలె

పరసీతను వారికిచ్చి–నీదు
తోవను నీవుపోరా–రావణా!

అని పాటలచే వడించెను

♦ ♦ ♦ ♦

గంజాం జిల్లాలో ఏడాది శిక్ష విధించబడి, కారాగారోపస్థితుడై – "పదవే భద్రాద్రికి – పాపిష్టిఘటమా!" యను గీతాలాపన.

# మరికొన్ని సూక్తులు

"గాంధీగారి అహింసాయుత అసహాయోద్యమంలో అసహాయం కంటె అహింసయే ఎక్కువపాలు', "ప్రహ్లాద సాధనచేస్తే నారసింహంగా పరిణమిస్తుంది", "ఠాగూరు కవిత్వం చేకూరి వెంకటకవి పాకానికైనా రాదు', "పూర్వం రామాయణమైతే యిప్పుడు రామా రాయణం' (అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజా రామారాయణం గారు), "గాంధీ పురుషోత్తముడనుకొన్నాము కాని ఉత్తమ పురుషుడైనాడు', "ప్రథమసమాగంలో కూడా ప్రెస్ కరెస్పాండెంటేనా?", "పరస్పర స్నేహానికి పరిహాసమే ప్రమాణము", "నేనూ ఒక పబ్లిక్ సంస్థనే', "ప్రస్తుత పురపాలన పానాపాన పరిపాలన", శ్రావణమాసంలో సాతాళింపు ధాతువు', "రాజకీయవేత్త రాజ్యమునకు భర్తయే కాని పుత్రుడు కానేరడు – వందేమాతరంభావము రాజకీయములలో దూష్యము", "గురువులకు దక్షిణ యివ్వాలి కాని వేతనాలేమిటి?' "కాంగ్రెసు జెండా దూదేకుల జెండా (Spinners Weavers flag)' ఆదన్ (శ్రీసతి కొప్పుపై, తనువుపై ఇది Indian definition of a straight line', "బ్రహ్మసూత్రాలు చూడవలసిన వాళ్ళకి యీ కంపెనీ ఆక్టు (Company Act) తెలుగుకండీ?" "దేముడు గుంటూరులో యిప్పుడు పొగాకుగా వెలిసేడు', "ప్లస్సూ మైనసూ వేసి చూస్తే, మనరాష్ట్రంలో ఒక్క నాగేశ్వరరావుగారే మిగుల్తారు', "'రా' అంటే రాజ్యం, 'మ' అంటే మనది – 'రామ' శబ్దంలో స్వరాజ్యం ఉంది".

